

డా॥ సిహెచ్. రమేష్

అడివిపై ఆగడం ఉంది

అడివికి ఆకలి ఉంది

ఆకలే కాదు ఆవేదనా ఉంది

ఆవేదనే కాదు

ఆవేశం - ఆలోచనా ఉంది

మన గుండెకు కండ్లు మొలిచినప్పుడు

ఆ కండ్లే పరిశోధకులపైనప్పుడు

# అడివి

## (కవితా సంపుటి)

డా॥ సిహెచ్. రమేష్

2003
ఎస్.ఎస్. పబ్లికేషన్స్
ఆదిలాబాద్.

Ch. Ramesh

# ADIVI

Collection of the Poems

*By*

***Dr. Ch. Ramesh***

First Edition - Nov. 2003

Cover photo : **MURALIDHAR AHUJA**

Copies : **1000**

Rs. : **30-00**

Printed at : **GANDHI PRINTING PRESS, ADILABAD.** ☎ : 232496

Cover Design : Laxmi Print & Pack, Hyderabad

**S.S. PUBLICATIONS**
C/o. R. Premalatha (Lecturer in Chemistry)
H. No. 1-3-67, Shanti Nagar,
Near Sai Baba Temple,
**ADILABAD** - 504 001(A.P.)
☎ : 08732 - 225320

**NAVODA BOOK HOUSE,**
Opp. Arya Samaj Mandir, Kachiguda, Hyderabad

**VISHALANDRA BOOK HOUSE,**
Bank Street, Hyderabad

**PRAJASHAKTI BOOK HOUSE**
Chikadpalli, Hyderabad

# మట్టిచిత్రాలు

**కొత్తపల్లి జయశంకర్**
మాజీ వైస్ ఛాన్సలర్
కాకతీయ విశ్వవిద్యాలయం

పది సుదీర్ఘ ఉపన్యాసాలకంటే ఒక చిన్న గేయంతో ప్రజానీకాన్ని ఎక్కువ ప్రభావితం చేయవచ్చు. చెప్పదలచిన విషయం ప్రజలకు సంబంధించినదయినప్పుడు ప్రభావం మరింత ఎక్కువ ఉంటుంది. ఈ మధ్య తెలంగాణా ప్రాంతంలో వెలువడుతున్న రచనలు ఈ వాస్తవాన్ని ధృవపరుస్తున్నవి. యువ మిత్రుడు డా. రమేశ్ రాస్తున్న కవితలు కూడ ఈ సత్యాన్నే చాటుతున్నవి.

ఈ సంకలనంలోఉన్న గేయాలు అనేక అంశాలను స్పృశించి నప్పటికి ప్రధానంగా అవి సమాజానికి, సమాజంలోని మానవ సంబంధాలకు సంబంధించినవి. అందులోను బాధిత, పీడిత వర్గాల ఆవేదనలకు అద్దం పడుతున్నవి.

"కవిత్వమంటే......
అది సమాజం చేతిలో అద్దం"

అని నిర్వచనం చెప్పి తన కవిత్వాన్ని సార్థకం చేసే ప్రయత్నం చేసినాడు రచయిత. సమాజంలోని అసహాయుల గురించి చెప్పుతూ

"...... పెన్నెత్తి రాయండి చదువు రానోళ్ళ గూర్చి
గళమెత్తి పాడండి గొంతు లేనోళ్ళ గూర్చి"

అని చదువుకున్న వారికి ఉండే సామాజిక బాధ్యతను జ్ఞాపకం చేస్తున్నాడు. దాదాపు ఇటువంటి మాటలే ముప్పై అయిదేళ్ళ క్రితం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అప్పుడు వైస్ ఛాన్సలర్‌గా ఉన్న ఆచార్య

రావడ సత్యనారాయణ గారి నోటినుండి వెలువడినవి. 1968-1969 నాటి తెలంగాణా ఉద్యమం తారాస్థాయికి చేరిన రోజులవి. ప్రజలు న్యాయం కొరకు పోరాడుతున్నప్పుడు విద్యావంతులు ప్రేక్షక పాత్ర వహించటం క్షంతవ్యం కాదన్నాడు. బాధిత ప్రజానీకం గళం విప్పినప్పుడు విద్యావంతులు కలం పట్టడం కనీసం ధర్మమని ఉద్భోధించినాడు. ఆనాడు వారు ఇచ్చిన స్ఫూర్తితోనే తెలంగాణా సమస్యపై విద్యావంతులు రాయటం మొదలయింది. డా. రమేశ్ రచనా వ్యాసంగంలో కూడా దాదాపు ఆ పరంపరే చోటు చేసుకున్నది.

డా. రమేశ్ కవితలో అక్కడక్కడా తెలంగాణా వాడుక భాష పదాలు కూడ ఉన్నవి. "బురద బుక్కిన" "బరిబద్ద బొక్కలు" "పొర్లించుకున్న" మొదలగు పదాలు తెలంగాణాలోనే విరివిగా వాడబడుతాయి. ఇటువంటి రచనలను ప్రోత్సహించవలసిన అవసవరం గతం కంటే ఇప్పుడు ఎక్కువగా ఉన్నది. తెలంగాణా ప్రాంతపు యాస, నుడికారం వలసవాదుల చేతిలో నిరాదరణతో పాటు అవహేళనకు గురికావటం రోజురోజుకు పెరిగిపోతున్నది. ఇది చాలా ప్రమాదకరమైన ధోరణి. ఏ ప్రాంత ప్రజలయినా ఆర్థికంగా వెనక బడితే మళ్ళీ పుంజుకోవచ్చు. రాజకీయంగా అణచివేయబడితే మళ్ళీ తెప్పరిల్లుకోవచ్చు. కాని సాంస్కృతికంగా, భాషాపరంగా ఉన్న ప్రత్యేకతను కోల్పోతే తమ అస్తిత్వాన్ని శాశ్వతంగా కోల్పోతారు. ఈ విషయంలో నేటి తెలంగాణా రచయితలకు అవగాహన కలగటం చాలా సంతోషించదగ్గ విషయం.

అదివాసుల స్థితిగతుల గురించి, వారి అభ్యున్నతికి పరితపించి, శ్రమించిన, కీ.శే. జనార్ధన్ రావు గురించి రాసిన కవితలుఈ సంకలనానికి ప్రత్యేకతను తెచ్చిపెట్టినవి.

సమాజంలో సంభవిస్తున్న పరిణామాల గురించి స్పందిస్తూ ఎంతో పరిణతితో రచనలు చేస్తున్న డా. రమేశ్ ను అభినందిస్తూ. ఈ వ్యాసాంగాన్ని ఇంకా కొనసాగించాలని ఆకాంక్షిస్తూ.....

**- కొత్తపల్లి జయశంకర్**

4-8-112 కుమార్ పెల్లి
హనుమకొండ - 506 011
ఫోన్ 0870 - 2573822

# ఇప్పపూల పరిమళం

సమస్యల పట్ల స్పందిచే మనిషికి బాధ్యత ఎక్కువ. సమస్యనెట్లా ప్రజలమధ్యకు తీసుకురావాలనే తపన వెంటాడుతూనే వుంటుంది. కవిత్వ రూపం తీసుకోవడానికి సమస్యపట్ల అవగాహన, సన్నివేశంపట్ల స్పందన అవసరం. ఇవి రెండు డా. రమేష్ కవితలలో కనిపిస్తాయి. 'అడివి' కవితా సంకలనం చాలా అంశాలనే స్పృశించింది. వ్యక్తిగత అనుభూతులు మనుషుల మధ్య నుండే సంబంధాలనుండి, సామాజిక జీవనానికి ముఖ్యంగా ఆదివాసుల జీవనానికి పట్టుకొమ్మయిన అడివిదాకా, ప్రాంతీయ సమస్య నుండి అంతర్జాతీయ అంశాలదాకా ఈ సంకలనం పరిధి విస్తరించివుంది. వ్యక్తిగత మోసాలకు, కుట్రలకు, దోపిడికి వ్యతిరేకంగా మార్కెట్ శక్తులకు వ్యతిరేకంగా, అమెరికా సామ్రాజ్యవాద దాహానికి, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా కవితలు రూపుదిద్దుకున్నాయి. వనరుల మీద, మానవులమీద జరిగే దోపిడికి వ్యతిరేకత అన్ని కవితల్లోను కలిపివుంచే కేంద్రాంశంగా మనం చూడవచ్చు. అడివితల్లి ఆర్తనాదాన్ని తన అమాయక బిడ్డల రక్షణకై 'తుడుం' మోతతో మేల్కోవాలనే ఆరాటాన్ని అడివి అద్దం పడుతుంది.

మిమ్మల్ని కడుపున బెట్టుకు సాదితే
నా బిడ్డ బతుకులో కత్తులు దించుతారనుకోలేదు
చుట్టాలతో సహజీవనమేగాని చట్టాల లొసుగులత
సావాసం తెలియదు
అందుకే ఓటమెప్పుడు వాడిదయ్యింది
విజయమెప్పుడు మీదయ్యింది.

గిరిజనేతరులు, గిరిజన తమ్ములు ఆదివాసుల ప్రాథమిక హక్కులు, భూమి, బతుకుదెరువు ఆధారమైన చదువులు, కొలువులు అప్పనంగా పొందడం మనకు కళ్ళకు కట్టినట్లుగా కనబడ్తుంది. ఆదివాసులు ఎదుర్కొనే సమస్యనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణా ప్రాంతం ఎదుర్కొనే సమస్యగా మనం చూడవచ్చు. సుస్థిర జీవనానికి కావల్సిన వనరులన్ని వుండి కూడా ప్రాంత ప్రజలకు దక్కకుండా పరాయి ప్రాంతాలకు తరలిపోవడం వెనకనున్న పాలకపక్ష కుట్రను 'గుండెతడి' నిజంగా మనకు గుండెతడినే మిగులుస్తుంది.

బురదబుక్కిన మా ఒంటిని బరిబద్దబొక్కల్ని
తడమని గోదారి మమ్మల్ని చుట్టొచ్చి మీదయ్యిందా !?

అన్న ప్రశ్నకు సమాధానం ఎట్లా దొరుకుతుంది ? తరతరాలుగా గోదావరి నది వెంబడే జీవిస్తున్న ఆదివాసుల పొలాలకు నీరెందుకు పారదో, అక్కడే వున్న గిరిజనేతరులకు, సుదూరానున్న ప్రాంతాలకు ఎందుకు పారుతుందో అర్థం చేసుకోవడానికి అభివృద్ధి రాజకీయార్థిక నేపథ్యాన్ని గుర్తుచేసుకోవాల్సి వుంటుంది. అది ఆదివాసుల సమస్య అయినా, ప్రాంత సమస్యయినా, బడుగుదేశాల సమస్యయినా, వనరుల కొరకే జగడాలు జరుగడమనేవి తన కవితలలో డా. రమేష్ స్పష్టంగానే వివరించాడు.

ఆదివాసి సమస్యలైన భూ పరాయికరణ, 1/70 చట్టం అమలు, గిరిజనేతరుల దోచుకునే వైనం, ఆదివాసి జాగురూకతపై పరిశోధక సిద్ధాంతాన్ని, అనేక వ్యాసాలను, కవిత్వాన్ని వ్రాసిన జనార్థన్ తనే ఓ కవిత్వమై అడవితల్లి ఒడిలో ఒదిగిపోయిన సత్యమే అడవి కోయిల, ఆదివాసులను గురించిన తన శోధన, ఆర్తి, ఆవేదన, ఆలోచన ఎందరికో స్ఫూర్తిగా వుందనేది ఇంకా ముందు ముందు వుంటుదనే నమ్మకాన్ని రమేష్ వంటి యువ కవులు, సమరజీవులు కలిగిస్తున్నారు.

**డా॥ రేవతి**
కాకతీయ విశ్వవిద్యాలయం
20-10-2003

# అంకితం



నా జీవితపు తొలి మెట్టు

తాత కీ॥ శే॥ చింత నర్సయ్య కు.....

# అంకితం



నా ఆలోచనల దిక్సూచి

కీ॥ శే॥ ప్రొ॥ వి. జనార్ధన్‌రావు గారికి .....

# మీతో రెండు ముచ్చట్లు

నేను ఈ సంకలనాన్ని తీసుకు రావడంలో గల నేపథ్యాన్ని వివరిస్తే అసందర్భమేమి కాదనుకుంటున్నాను. నేను మొదట కవిత రాసింది 1997లో, నేను ట్యూషన్స్ చెప్పుకుంటున్నపుడు సరదాగా పాటపాడమని అడిగితే ఒక చిన్నపాప పాడినపాట నన్ను "ప్రశ్నాగ్ని" కవితను రాయించింది. అప్పుడది కవితనో, కాదో కానిరాశాను. అయితే కవిత్వాన్ని సీరియస్‌గా తీసుకున్నది. సమాజం అర్థమవుతున్నప్పటి నుంచే.....

ఇదే క్రమంలో మెడికల్ కాలేజిలో జాయిన్‌కావడం "మండల్ కమీషన్" పోరాటంతో కొత్త సంఘర్షణ మొదలయ్యింది. అంతకుముందు వామపక్ష విద్యార్థి ఉద్యమానికి దగ్గరగా ఉండడంతో "కులం" ను ఒక సమస్యగా గుర్తించలేదు. ఆ తర్వాత వరంగల్ పబ్లిక్ గార్డెన్‌లో "కోయదొరల అభ్యుదయ సంఘం మీటింగ్‌కు అటెండ్ కావడం, దానికి ముఖ్య అతిథిగా వచ్చిన ప్రొ. జనార్ధన్‌రావు సార్‌తో పరిచయం ఏర్పడింది.

మొదటి పరిచయంలోనే ఆయన మంచి వ్యక్తిగా విషయాల పట్ల పూర్తి అవగాహన, సమస్యల ఎడల స్పష్టతతో సూటిగా గుండెల్లోకి హత్తుకుపోయే విధంగా మాట్లాడే వారని తెల్సుకున్నాను. చిన్న పెద్ద తార తమ్యాల్ని ఆయన పాటించేవారు కాదు. తను మాకు అర్థమౌతున్న కొద్దీ మేం మరింత అతని వ్యక్తిత్వానికి లొంగిపోయాం.

"మేం" అంటే జనార్ధన్‌రావు గారికి అప్పుడు ఒక్క కాకతీయ యునివర్సిటీలోనే కాక ఆర్.ఇ.సి., కె.యు.సి. "లా" కాలేజిలో కూడా అతనికి అభిమానులుండేవారు.

అప్పటికి 1/70 యాక్ట్ చేసి 23 సంవత్సరాలైనా ఒక్క నాడు కూడా చట్టం అమలుపై శ్రద్ధచూపని వారు చట్టం సవరణకు చేసే డిమాండ్ వెనుక ఉన్న

కుట్రను వివరించేవారు. "చట్టం ఎందుకొచ్చినా మనమంచికే వచ్చింది. దాన్ని కాపాడుకోవడం మన విధి" అనే వారు. దాన్ని ప్రచారం చేసేందుకు కృషి, అధ్యయన స్వచ్ఛంద సంస్థల ద్వారా సదస్సులు, మీటింగ్స్, పట్టణాల్లో, గూడాల్లో ఏర్పాటుచేసి ఎందరికో గిరిజన చట్టాల గూర్చి అవగాహనను కల్పించారు. సమ్మక్క సారలమ్మ జాతరకు గిరిజనేతరున్ని చైర్మన్‌గా నియమించినపుడు తీవ్రంగా వ్యతిరేకించారు.

మణుగురు దగ్గర కొండాపూర్‌లో సింగరేణికి భూములు కోల్పోయిన గిరిజనులకు ఉద్యోగాలు సాధ్యంకాని పరిస్థితుల్లో నష్టపరిహారం క్రింద తను తయారు చేసిన ప్యాకేజి ఆదివాసుల యెడల తనకు గల నిబద్ధతను తెలియజేస్తుంది. ఆదివాసుల విద్యాభివృద్ధికి తను పడ్డ తపన తక్కువేమి కాదు. ఫీజులు కట్టడం దగ్గర్నుంచి సీట్ల వరకు అన్ని రకాల సహాయ సహకారాలను అందించారు. సామాజిక న్యాయం ఉన్నప్పుడు దాన్ని వెన్నంటే సాపేక్షిక న్యాయం ఉంటుంది. అందుకే పంచుకునే తత్వానికి అలవాటు పడాలంటారు..

ఇన్ని చేసినా అన్ని సందర్భాలలో ఆదివాసి సమాజం ఆయనను అక్కునేం చేర్చుకోలేదు. కొన్ని సందర్భాలలో అనుమానించబడ్డా... అది వారి తెలియని తనంగానే భావించి నేను పుట్టు గిరిజనున్ని కాకపోయినా పెట్టు గిరిజనున్ని అనేవారు సర్వదా ఆదిమజాతుల శ్రేయస్సుకై పరితపించి పోయేవారు. నేను అడపాదడపా సంఘటనలకు స్పందించి కవిత్వాన్ని రాసేవాన్ని ఇందులో ఏమైనా కవిత్వమున్నదా ? అంటే "మనకు జీవితమైనా కవిత్వమైనా అనుభవిస్తూనే, రాస్తూనే నేర్చుకునేది. రిహార్సల్ ఉండవు". అంటూ ఇప్పటి సమాజం ఎవరి గూర్చి వారే ఆలోచించుకునే స్థితిలో ఉంది. అందుకే మీ బాధలు, కష్టాలు, కన్నీళ్ళు మీకు మీరే రాసుకునే ప్రయత్నం చేయాలి. నువ్వు; దయానంద్, చందూ, అంజయ్య లాంటివాళ్ళు రాసే ప్రయత్న చేయాలి. అంటుండేవారు. మేమేం రాస్తాం సార్ మీరున్నారుగా ! అంటే "రాసి రాసి దమ్ముకొచ్చిందయ్యా" అనే వారు దమ్ముకొచ్చిందన్న మాట ఇప్పుడర్థమౌతుంది. నా కవిత అడవి తల్లి ని తానే బలవంతంగా 'మన్నెంలో' అనే పత్రికకు పోస్ట్‌చేయించారు.

ఎన్నో రూపాల్లో కూడా పరిణతి సాధించిన వ్యక్తి సమాజానికి ఉపయోగపడాల్సిన మేధావి హఠాత్తుగా అన్ని వదలి కనుమరుగయ్యారు. తను లేని లోటు ఇతర ఉద్యమాలకు, సంఘాలకు మరెవ్వరైనా భర్తీ చేయగలరేమోగాని, ఆదిమ వాసి, సమాజానికి సమకాలీన పరిస్థితుల్లో ఆ స్థాయి కమిట్ మెంట్‌తో పనిచేసే మేధావులు దొరకడం కష్టం. అందుకే ఆదిమవాసి సమాజం మొత్తం విశాఖ నుండి ఆదిలాబాద్ దాకా గుండెను కోల్పోయి, గొంతుక మూగబోయిన రేల పాటయ్యింది. అడివంతా కాలం అనే పులి పంజా దెబ్బకు పేగులు తెగిన.......... శోక సముద్రమైంది.

ఇప్పుడాయన శిష్యులుగా మా శక్తికొద్ది లేశ మాత్రంగానైనా తను వదిలిన బాధ్యతను మేం మోయాల్సి ఉంది. అది నాకు, మాకు శక్తికి మించిన భారమే. ఈ సందర్భంనుండే ఈ సంకల్పాన్ని చూడాలని ఆశిస్తూ. ఈ ఆదిమవాసి జీవితాన్ని రేఖామాత్రంగానైనా వ్యక్త సమాజం ముందు తీసుకువచ్చే ఈ చిన్న ప్రయత్నం.

నా ఈ తొలి ప్రయత్నాన్ని అందరూ ఆదరిస్తారని ఆశిస్తూ........

**- డా॥ సిహెచ్. రమేష్**

# ఎట్లా మరిచి పోతాను !

నేను సమాజాన్ని అర్థం చేసుకునే క్రమంలో తీవ్రమైన అంతర్గత సంఘర్షణ జరుగుతున్న సందర్భాలలో నా ఆవేదనకు అక్షరరూపమే ఈ కవితా సంపుటి అడిగినంతనే అనేక కార్యక్రమాలతో ఊపిరిసలపని పనితో ఉన్న ముందు మాటని రాసి ఇచ్చిన పెద్దలు, పూజ్యులు కాకతీయ యూనివర్సిటి మాజీవైస్ ఛాన్సలర్ ప్రొ. జయశంకర్ గారికి మాటల్లో సాధ్యం కానిదీ అక్షరాల్లో చెప్పగలనా !

ఇంటి పనులలో తనమునకలై ఉన్నప్పటికీ మిత్రవాక్యం రాసి ఇచ్చిన నా స్ఫూర్తి ప్రధాత ప్రొ. జనార్ధన్ రావు గారి సతీమణి డా. రేవతి మేడమ్ గారికి రెండు చేతుల జోడింపు సరిపోవనుకుంటా !

ఈ సాహితి ప్రపంచంలోకి లాక్కొచ్చిన మిత్రులు డా. ఉదారి నారాయణ, రాజ్ కుమార్, దారా సుబ్బారావు, జానా పోశెట్టి, కారం శంకర్ గార్లకు.

ఆదిలాబాద్ పెద్దదిక్కు, సాహితీ ప్రపంచానికి కురువృద్ధులు పెద్దలు డా. సామల సదాశివ మాస్టారు గారికి

అమూల్య సలహాలనందించిన వసంత్‌రావు దేవ్‌పాండే, పి.సి. రాములు, చందన్‌గిరి దేవయ్య మరియు బి. మురళీధర్ గార్లకు

ఆర్థిక, హార్థిక ప్రోత్సాహాన్ని అందించిన మిత్రులు డా॥ గౌరినాథ్, డా॥ ఎ.పి. శ్రీనివాస్ రావ్, డా॥ నరేందర్ రాథోడ్, డా॥ ప్రకాశ్ డా॥ చందు, డా॥ మనోహర్, డా॥ దయానంద్ లకు

కవర్ పేజీ ఫొటోకు సహాయం చేసిన అహుజా ఫొటో స్టూడియో, మురళీధర్ ఆదిలాబాద్ గార్కి

సంకలనానికి అందమైన రూపాన్ని అందించిన కట్ట దామోదరా చారి, గాంధీ ప్రింటింగ్ ప్రెస్, ఆదిలాబాద్ గారికి

నా జీవిత కావ్యానికి ముఖచిత్రమైన ప్రేమలతకు, మా స్పందనలకు అందని మా రెండు కలల ప్రపంచాలు సాహు, సాహితీలకు నాకు వెలుగు నిచ్చిన అమ్మకు, తోబుట్టువు చెల్లెలు పద్మకు ఎప్పటికీ ఋణపడే ఉంటాను.

నా కవితల్ని అచ్చేసిన మన్నెంలో, ప్రజాశక్తి, ఆంధ్రప్రభ, ప్రసారం చేసిన ఆల్ ఇండియా రేడియో ఆదిలాబాద్ గార్లకు ఇంకా ప్రత్యేక్ష పరోక్ష సహాయ సహకారాలందించిన మిత్రులందరికి నమస్సుమాంజలి.

- డా॥ సిహెచ్. రమేష్

# అడవి తల్లి

*బిడ్డలారా !*
మీలో ఒకడు దత్తతకొచ్చి దండుకు పోతున్నాడురా !
పాక్కుంటూ వచ్చి పాలడిగి
చివరికి నా కన్న బిడ్డకు పరిగకూడా మిగలనివ్వడంలేదే....!
కడుపులో మంట తెలిసినదాన్ని
అప్పుడు నమ్మి రొమ్మిచ్చాను ఇప్పుడు రోదిస్తున్నాను
మీలో మరొకడు దోస్తినంటూ వచ్చాడు
కాని వాన్ని దోచుకుంటాడనుకోలేదు
మిమ్మల్ని కడుపున బెట్టుకు సాదితే
నా బిడ్డ బతుకులో కత్తులు దించుతారనుకోలేదు
ఆకలితో వచ్చారనుకున్నాను గాని ఆధిపత్యంకోసమనుకోలేదు
ఆట పాట అడవి బాటలే తెలిసిన అమాయకుడు వాడు
మీలా మాట మర్మాలు మాయావాదాలు తెలియవు

చుట్టాలతో సహజీవనమేగాని చట్టాల లొసుగులతో సావాసం తెలియదు
అందుకే ఓటమిప్పుడు వాడిదయ్యింది
విజయమెప్పుడు మీదయ్యింది
ఆకలి అనారోగ్యం ఆపదలు వాడి సంపదలైతే !
అవకాశాలు ఆశలు అందలాలు మీకైనై
నేను కూడ సగానికి సగమైన
మీ నగరాల కోసం
నగలకోసం నజరానాలకోసం
అందుకే "తుడుం" మ్రోగించమన్నా
సాంప్రదాయకంగా జంతువుల్ని వేటాడేవానికి
బాణమెత్తమన్నా బతుకును బాకీలుగా మార్చే వాళ్ళపై,
*బిడ్డలారా !*
మీరెప్పుడన్నా నారొమ్ము నుండి బుక్కెడుపాలు తాగుండరా !!
అయితే పెన్నెత్తి రాయండి చదువు రానోళ్ళ గూర్చి
గళమెత్తిపాడండి గొంతు లేనోళ్ళ గూర్చి
అందరు కలిసి రారండి నా అడవిబిడ్డ ఆదివాసి గూర్చి

(తుడుందెబ్బ మరియు పశ్చిమగోదావరిలో జరుగుతున్న సంఘటనలకు స్పందనగా) (మన్నెంలో 1998)

# ప్రశ్నాగ్ని

నా చిరుప్రాయంలోనే రగిలిన ప్రశ్నాగ్నిపై
చల్లని కర్మ సిద్ధాంతపు నీటి జల్లు చిలకరించారు
అక్షరాభ్యాసంలో అ ఆలతో హస్తమందో పుస్తకం
అందులోని అక్షరాలే "సారా"కుమారుగా
మరో మత్తుమంద్దై మది నిండిపోతే.....
కొందరి పూర్వజన్మ సుకృతాలే ఎందరో జీవితాలకో వికృతాలైనా
పరలోకపు పాటలకే పదును పెట్టాను
గళమెత్తి గట్టిగా గానం చేశాను
అగుపడని ఆగంతకుని కోసం అహర్నిశలు అరిచాను
అగుపడుతున్న అభాగ్యులను మరచాను
మదిలో ఉన్న మత్తుతో కసిరాను
ఒకనాడు నడిరోడ్డున నే నడిచెళ్తుంటే
ఎదనుండి ఎగసొచ్చే ఎర్రని నెత్తుటితో
తడిపెగరేసిన తలగుడ్డల్ని చూశాను
రగిలే నలిగే గుండెల్ని కలిశాను
అప్పుడు కర్మ సిద్ధాంతపు కట్లు తెగాయి
నాబాల్యంలో సమాధైన ప్రశ్నాగ్ని నా యవ్వనంలో పునాదై లేస్తోంది
అది నింగి నంటుకుంటుంటే
రేపటి సూర్యున్ని ఈరోజే చూస్తున్నాను
నాచుట్టూ ఉన్న కష్టజీవులలో

(ప్రజాశక్తి 4-9-87)

# అడివి

అడివి ఆకుపచ్చగా ఉంటుంది
ఆకుపచ్చగానే కాదు ఆహ్లాదంగా అందంగానూ ఉంటుంది
అందంగానే కాదు సుష్ఠుగా పుష్టిగా ఉంటుంది
మన కండ్లు పర్యాటకులవైనప్పుడు

అడివిపై ఆగడం ఉంది
అడివికి ఆకలి ఉంది
ఆకలేకాదు ఆవేదన ఉంది
ఆవేదనే కాదు ఆవేశం - ఆలోచనా ఉంది
మన గుండెకు కండ్లు మొలిచినప్పుడు
ఆ కండ్లే పరిశోధకులవైనప్పుడు

(02-09-2001)
(తత్వ కవి ఉదారి నాగదాసుగారి వర్ధంతి కవిసమ్మేళనంలో)

# వాస్తవం

ఆనాడు నుండి ఈనాడు వరకు
అన్నీ హైటెక్కు జిమ్మిక్కులే
మెదడుకు మేతలో అంతా కల్తే
కలలకు కలర్సు పూసి
నేటిని దాచి రేపుని చూపిస్తాడు
వీక్షణం తీక్షణమైనప్పుడు
హృదయం "తేజో"వంత మౌతుంది
కలలు కరిగిపోతాయి కలర్సు కారిపోతాయి
వాస్తవం బషీర్ బాగ్‌కు రక్తంతో రంగేస్తుంది
కాలిన బస్సులు కాసేపు విహారం చేస్తాయి
మీకోసం ఏడవకండి మాకోసం ఏడవండని
అందుకే మధ్య తరగతి మనమందరం
మూగవారిగా - గుడ్డివారిగా మారిపోదాం
కృత్రిమ నవ్వులతో
మీరేంచేసినా మాకు నొప్పిలేదు అందుకే
అచ్చంగా బుల్లిపెట్టె యాడ్‌లా జీవిద్దాం

(తత్వ కవి ఉదారి నాగదాసుగారి వర్ధంతి కవిసమ్మేళనంలో-2000)

# వెంటాడే సమాధానం

పత్తుల పొత్తిలి వత్తిళ్ళలో
పగిలిన గుండెల చప్పుడు
తెలంగాణ
ఉత్తరం దక్షిణం మధ్యలో ఊపిరాడక
ఎగరగొట్టబడ్డ ఊరిపోరగాని ఉద్యోగం
తెలంగాణ
రాజ్యం రాజముద్రతో పసిపిల్లను విప్లవకారిణిగా మార్చి
వీర మరణం ప్రసాదించింది
తెలంగాణ
షావుకారి గుండెను బాధ్యతగల భటుడి బందూకుగుండు
అసంకల్పితంగా ముద్దెట్టుకుంది
తెలంగాణ
తిండిలేక కండలేని ఎండినోళ్ళు
నెర్రెలుబారి నెగళ్ళ కుంపటయిన నేల
తెలంగాణ

నేసిన గుడ్డ వంటికికాక
పేనిన తాడై కంఠాన్ని కరచి కాటికి సాగనంపింది
తెలంగాణ
కండ్లముందే కాలం కాటుకు కనుమరుగయ్యే కొడుకులు
కన్నతల్లులకు కారికారి "కరువైన" కన్నీళ్ళు
తెలంగాణ
ఇది బార్లల్లో బీరు దొరికే చోటేకాని
తాగేందుకు ఊళ్ళ బోర్లలో గుక్కెడు నీళ్ళు దొరికే చోటుకాదు
ఇదే తెలంగాణ నా తల్లి తెలంగాణ
తెగిపడ్డ మొండాలకు మొలిచిన కేక
రాలిపడ్డ రక్తపు చుక్కల రాగం
కోటిన్నొక్క మోసాల దగాల వంచనలకు సమాధానం
తెలంగాణా / నా తల్లి తెలంగాణ !!

రచన కాలము
02-09-2001
(అముద్రితం)

# మనుసుల ఉగాది

పత్తిగింజల పడగనీడలో
పత్తిపూల పాడెల పాట
రైతుల ప్రాణాల దోబూచులాట
ఉండదు కదమ్మా నీ హయాంలో
రాజకీయాలు రాసక్రీడలు రాక్షసక్రీడలుగా మారి
రక్తమే రణక్షేత్రపు రంగేళికాదుగా నీ కౌగిలిలో
విలువలు వలవలు విప్పబడి
ముసుగులు కప్పబడి
దొరికిన దొంగలు దొరలై
నీతుల కోతలు కొయ్యరుగా తల్లీ నీ ఒడిలో
ఆకలి ఆలింగనంలో
అణిగున్న బ్రతుకులు
గంజినీళ్ళయినా గతికే భాగ్యం
మిగిలుంటుందా ? నీ సహచర్యంలో
కాలం కత్తిగా మారి

ఉక్రోషంలో ఉద్రేకంలో
కంపరమెత్తి కల్లోలమై
కలల్ని ఖండించదుగా కనికరంలేకుండా మాత
వేపపూత మామిడిపింద
మాకందకుండ మటుమాయమవ్వవుగా
కాకిలెక్కల కనిపించని అడవుల్లా తల్లీ
మనుషులు మరోమనుషులుగా
మరమనుషులుగా మారక
మమతానురాగాలు నిండిన
మానవులుగానే ఉంటారుగా నీ పాలనలో
అయితే అన్ని హామీలతో
అథఃపాతాళాలు అంతరాలు
అగాధాలు లేని ఉగాదివై
రమ్మని ఆహ్వానిస్తున్నాను
ఆనందంగా ఆలింగనం చేసుకుంటున్నాను

(ఉగాది 2001 ఆలిండియా రేడియో ఆదిలాబాద్)

# మేల్కొని

చీకటి విచ్చుకత్తుల పహారాలో
కాలం వేల సంవత్సరాలు
తన్నుతానే మర్చిపోయింది
ఒంటి నిండా గాయాలతో దేక్కుంటూ నడిచింది
మెదడును ఎవడికో కుదువబెట్టి
తనలోనే కుంచించుకుపోయింది
ఫెడేల్‌మనే పిడుగుదెబ్బతో
ఆ మెరుపు వెలుగులో తననుతాను చూసుకుంది
కురిసిన వర్షపు చినుకుల్లో తడిసి
అజ్ఞానాన్ని కడిగేసుకొని
మూర్ఖత్వంపై యుద్ధం ప్రకటించింది
ఆ పిడుగైనా ఆ మెరుపైనా ఆ వాన చినుకైనా
అంబేద్కరును తలచుకుంటూ.....
సనాతనత్వాన్ని సవాలుచేస్తూ రేపటిసమసమాజంకై
ఉరకలువేస్తూ......

తేది. 6-12-1993

# ఒక విధ్వంసం - వేల గాయాలు

వర్తమానంలో గతాన్ని తూచి
స్మృతులపై యుద్ధం చేస్తున్నారు
ఖాళీ హృదయాలలో కల్మషాన్ని నింపుతూ
శవాల తోరణాలతో రేపటి రామరాజ్య పట్టాభిషేకానికి
సన్నద్ధమౌతూ
విధ్వంసమే పరమారధిగా
ముష్కర దండయాత్ర సాగుతోంది

తేది : 06-12-1993
(బాబ్రీ మసీదు కూల్చి సంవత్సరమైన సందర్భంగా)

# త్యాగాల తూకాల్లో

రక్తాన్ని మైక్రోస్కోపులో పరీక్షించినట్లు
నన్నునేను అన్నిరంగుల్లో వెతుక్కోవాలి
తప్పదుమరి పరిస్థితులు ప్రశ్నై కూర్చున్నప్పుడు
స్థూపాల్లో... పేరున్న భవనాల్లో...
వాడల్లో..... నగరాల్లో.....
ఎర్రగా రెపరెపలాడుతున్న జెండాల్లో
ఎక్కడన్న నా రక్తముందో..! పరిశీలించి చూడాలి
త్యాగాల తూకాల్లో తేడాలొస్తున్నప్పుడు
త్యాగ నిర్ణేతలు తప్పిజారి ఎక్కడన్న నా పేరు పలికరేమో....
ఎప్పుడన్నా నాకో అక్షరం జార్చారేమో
త్యాగాల పుస్తకాన్ని ఎత్తుకొచ్చిమరీ పేజీలు తిరగెయ్యాలి
కాషాయానికి ఎర్రరంగేసుకొని
వివేకానందుడు విప్లవకారుడౌతుంటే
తప్పదిక నారక్తమెక్కడ ఇంకిపోయిందో
నారూపం ఏడ అదృశ్యమై పోయిందో..
శోధించాలి....పరిశోధించాలి......

తేది 18-05-1993

(వివేకానందుడు విప్లవకారుడై అంబేద్కర్ జాతీయ బూర్జువాగా మారిన సందర్భం)

# కంటి శోకం

పృధ్వికి కోపంవస్తే....
వొళ్లు విరిస్తే.....
కొలతలు లేని కన్నీటి ప్రవాహాలు
అవధులు లేని రుధిరసాగరాలు
ఒక్క క్షణం
ఒకే ఒక్క క్షణం
తాను తల్లినని మరిస్తే
చితికిపోయిన జీవుల చితిమంటలు
పేర్చిన పీనుగల పూడ్చివేతలు
మనిషి ఒక్కసారి ఆదమరచి
కాస్త కునుకుతీస్తే
తెగిన బంధం
మిగిలిన శూన్యం
ఒక్క నిమిషం
పృధ్వికి కోపం వస్తే
వొళ్ళు విరిస్తే

మరణ మృదంగ ధ్వనులు
మాటలకందని మానవహననం
మరోవైపు
మరుభూమిలో
రాబందుల రెక్కల చప్పుడు
జీవచ్ఛవాలపై గుంటనక్కల
మొసలి కన్నీటి మడుగులు
అమానవత్వపు దోపిడి దొంగల అడుగులు
యాంత్రికతతో ఘనీభవించకుండా
మిగిలున్న కొద్దిపాటి మనస్సుల
వేదనల కన్నీటి బొట్లతో

(లాథూర్ భూకంపంపై స్పందన)

# కలల ఊరేగింపు

కాలం కౌగిలిలో యవ్వనం కరిగి పోతుంటే
ఎగిరే ఎత్తుల్ని మరింత పెంచుకుంటూ
అస్పష్టతలో ఈదుకుంటూ స్పష్టతను చేరుకుంటున్నాం
చీకట్లను సెకండ్‌షోలలో దాచేసి
వెలుగుల్ని వెక్కిరిస్తూనే
అక్కున చేర్చుకుంటున్నాం
ముందున్న మార్గాన్ని సుగమంచేసుకుంటూ
రేపటికి ఆగమనం పల్కుతూ సాగుతూనే ఉన్నాం
ఒక్కసారి గతంలోకి దూరిచూస్తే
నాల్గు సంవత్సరాలు
మెరుపుల పదాలై నిల్చున్నాయి
ఆలోచనల కుంపటిదగ్గర మన మంతా పోగై
అనుభవాలతో ఆకల్ని జోకొడ్తూ
బంధాల గొలుసులతో పెనవేసుకొని
నాల్గు అడుగులు వేశాం
గమ్యాలు దారిని మింగేస్తున్నాయి
బరువెక్కిన హృదయాలను ఆనందంలో జలకాలాడిద్దాం
అన్నీ మరిచి అనంతాకాశంలో విహరిద్దాం

# రాయాలనిపిస్తుంటుంది

రాయాలనిపిస్తుంటుంది అప్పుడప్పుడు
ఆలోచనల అగ్నికణాలై అనంతంలోకి దూసుకెళ్తునప్పుడు
భావాల బాణాలు దిశను నిర్దేశించుకుంటున్నాయి
అడవుల్లో మంటలైపోతున్న గుడిసెలు
కాలిపోతున్న కాష్టాలు
మోసపు వీర్యపు చుక్క
దానిలోని శుక్రకణపు విజయహాసం
న్యూస్ పేపర్ ముఖంపై ప్రత్యక్షమైనపుడు
ఈ ఆదివాసీ గుండెతో హైపర్‌టెన్షన్
ఆవేశం ఆలోచన చేతికలంతో మెలికలు తిరిగి
ముందుకు పోవాలనుకుంటాయి.
"నవనాగరికత" మెరుపేసుకున్న
చీకటి హృదయాన్ని ప్రశ్నించాలనుకుంటుంది
అస్పష్టత ముసుగు తొడిగి వేదనని దాచలేను
బలహీనుణ్ణి బంధించి
తుఫానులు కాపలా కాసినపుడు
ఇంట్లో ఇసుర్రాయిలో

మొక్కజొన్న గింజను చూసినపుడు
ఐదు వేళ్ళ సిద్ధాంతం నాగుండెను స్పృశించుకుంటూ వెళ్ళింది
సమాజం మొత్తంగా
రాతిమేఘాలకు ఉయ్యాలకట్టి
ప్రియురాలికి మౌనగీతం ఆలపిస్తున్నపుడు
నెత్తురోడుతున్న మా దేహాలకు మాత్రం
మృత్యుగీతం వినిపిస్తుంది
అందరికందరూ అనేక భావాల్లో అరెస్టయినపుడు
మా చరిత్రల ఫలకాల్ని మేమే చెక్కుకోవాలన్పిస్తుంది
మాముఖాలే మీ నిజప్రతిబింబాలయ్యేంతవరకు రాయాలనిపిస్తుంది

(యం.ఎల్.ఏ. బాలరాజు కిడ్నాపు ఇంకా ఏనిక లక్ష్మి మృతిపై స్పందనగా)

# ఆధునికం

భూమి కుంచించుకుపోయి కుగ్రామమయ్యింది
కోటి గొంతులు ఒకేచోట
అందరూ ఒకే గొంతుతో
మెదళ్ళు చాలా స్పష్టంగా
కపాలాన్ని దాటొచ్చాయి
కానీ గుండెలుమాత్రం ...?
"మనుషులు కుక్కల్ని ప్రేమిస్తున్నారు"
"జాతస్య మరణం ధృవం"
ఇక్కడ చావులన్నీ సహజ మరణాలే
కన్నీటిని డిక్షనరీ నుంచి చెరిపేసేందుకు కమిటీ వేశారు.
రాజ్యం చిల్లర పైసల్ని ముద్రిస్తుంది
శవంపై చల్లడానికి
నక్షత్రాల టోపీతో గ్రామపెద్ద
అందరికీ హుకుం జారీచేశాడు
మీ పెరళ్ళలో కలుపు మొక్కలు పెంచండి
నా దొడ్డిలో మాత్రమే కంకి మొక్కలు కనిపించాలి
కంప్యూటర్‌కి కడుపొస్తుందని

మా వార్డు కౌన్సిలర్ జ్యోతిష్యం చెబుతున్నాడు
నా దోస్త్ కరుణాకర్ దానికి పుట్టిన బిడ్డను పెండ్లి చేసుకొని అమెరికా
పోతా అని కలలుకంటున్నాడు
సాయంత్రం బుల్లిపెట్టెముందు కూర్చొని జనం
యాడ్స్ మధ్యలో ఎవడి కృత్రిమ స్వప్నస్కలనాన్నో
వాళ్ళు స్వప్నిస్తున్నారు
అనృతఫలాల తియ్యదనం ఆస్వాదిస్తున్నారు
తల్లిదండ్రుల తలకొరివికి
తనయులు పోస్ట్‌డేటెడ్ చెక్కులు అడుగుతున్నారు
కూతుళ్ళే కట్నంకోసం కన్నపేగుల్ని తెంచేస్తామంటున్నారు
"కాసులతల్లి వంటినిండా నగలతో
భిక్షాటనచేస్తూ
ఖర్చుచేసే వాళ్లకు మానవసంబంధాల్ని
కలుపుతానంటుంది
"భూమికుంచించుకుపోయి కుగ్రామంమైంది"

ప్రజాశక్తి - 2002

# కవిత్వమంటే

కవిత్వమంటే కానరాని ప్రపంచంలోకి పరుగెత్తే భావం కాదు
అంతర్ముఖ అనుభూతికి అద్దంకాదు
స్వగత మూల్గులకు రూపంకాదు
అది సమాజం చేతిలో దీపం
అక్షరమంటే
ఆడదాని అంగాంగాల మీదినుంచి జారిపడి
ఏరై వరదై గోదారై
అందమైన పొందికలో ఒదిగి కూర్చునే వాక్యంకాదు
అది మానవ మస్తిష్కంలో మెరిసే మెరుపు
రేపటి ఆలోచనల వర్షాన్ని తెలుపు
రాబోయే నవసమాజపు తొలితలపు
కాలంలో కలిసి కాలంతో మెలితిరిగి
కిరీటాల కోటల్ని దాటి
నియంతల పిచ్చిసామ్రాజ్యాలు విడిచి
అదోశక్తై సమాజంలోకి వచ్చింది
అది మరచి అక్షరాన్ని
అదోవిధంగా మార్చాలనుకునేవాళ్ళంతా
"నీరోచక్రవర్తులే"

# కాపలా

"గడియారం లాంటికళ్ళు రెప్పలు కొట్టకుండా కాపలా"
"వెలుగును మింగకుండా చీకట్లను అడ్డుకునే కాపలా"
"రహదారుల నుండి రాజులాంటి మనుషులవరకు కాపలా"
"అరాచకాన్ని ఆపివేసే కాపలా"
"జనం ఇంటికి కాపలా జనం వంటికి కాపలా"
"కాలంతో పోటీపడే వేల దేగకండ్లది కాపలా"
"రైతుకు కాపలా రాజ్యానికి కాపలా"
"క్రొవ్వొత్తిలాంటిది కాపలా"
"తాను కరిగిపోతున్నా ఒరిగిపోతున్నా ఓడిపోనిది కాపలా"

(పోలీసు అమరవీరుల సంస్మరణ దినోత్సవం జైనథ్ కవిసమ్మేళనం)
(తేది 21-10-2002)

# అడివి కోయిల

జనాన్ని అర్థం చేసుకున్నవాడా !
జనానికి అర్థమైనవాడా !
జనార్ధనరావా..!
తూరుపు దిక్కున తొలిపొద్దునుండి
దూసుకువచ్చే సూర్యకిరణాల్ని దోసిటపట్టుకొని వెతుకుతున్నాం
నీ సందేశాలేమైన అందులో ఉన్నాయేమోనని
గుట్టల్ని గుండెలో నిలుపుకొన్నవాడా!
గుట్టల్లోని గూడేలకు గుడారమైనవాడా!
చీకటి పడగానే నిశీధిని చీల్చుకొని నింగిలోకి
దూసుకెళ్తున్న మా దృక్కులు
తడుముతున్నాయ్ నక్షత్రాల్ని ఏ నక్షత్రంగానైనా
నీవు మారిపోయావేమోనని
సనుబాలివ్వకున్నా సంకనెత్తుకున్నందుకే
నేను పుట్టుగిరిజనున్ని కాకున్నా
పెట్టుగిరిజనున్ని అంటూ

ఆదివాసి తల్లి ఋణం కోసం
అడవి బిడ్డల ఆత్మవై
గిరిగీసి బరిలోనిలబడ్డ "గిరి" జనార్ధనుడా!
ఇంద్రవెల్లిలోయిరిగి పడ్డ లాఠీలకు ఇసుమంత తగ్గని నీ చైతన్యం
రీసెర్చిలోని సెర్చింగ్ అంతా మాటలురాని
మనుషులకే అంకితం అన్నవాడా?
ఆదివాసిపై ఆగడం మీద ఆగడం అయినపుడు
కాగడగా మారి అడవి దారుల్లో పారినవాడా...
గొత్తికోయల గోడంతా కన్నీరై "చంద్రవంక" సాక్షిగా
చెలిమెల్లో ఇంకుతుంటే
నరబలులనాటకరంగానికి రంగులద్దిన రాజకీయ పార్టీల
రంగునునిలదీసినవాడా...
నిదుర నుండి మేల్కొని చీకటిమదిలో
తడుముకుంటే నీ జ్ఞాపకాలే శిలా ఫలకాలై తగులుతున్నాయ్
పాలకుల సౌలభ్యపు గీతల్లో గిరిజనులు గింగిరాలు తిరుగుతుంటే
తల్లిని బిడ్డని ఇనుప కంచెల్లో ఇరికించి
వేరు చేసే హక్కెక్కడిదని ప్రశ్నించినవాడా !
అందని ద్రాక్షైన ప్రజారాజ్యం మూలవాసులకే ముల్లుగర్రై గుచ్చినపుడు
వలసల గడుసుతనం ముంజముద్దలు గడ్డ పెరుగై
మిమ్మల్ని గతి తప్పిస్తున్నాయా అని గద్దించినవాడా..
కాలేజి సీటుకై ఎగ్జామ్ ఫీజ్కై ఎక్కిల్లు పట్టిన ఎందరికో ఎత్తిపెట్టినవాడా!
1/70పై వంతులవారి సైంద్ధాంతిక పంతుల వక్రభాష్యపు ప్రచారాన్ని
ఖండిస్తూ
మునిగిపోయి మూలనబడే ముతకధోతిలకన్న

పొందూరు పెద్దంచుధోతులపై ప్రేమెందుకో అని
కయ్యానికి కాలు దువ్వినవాడా!
గుండెనుండి గుండెకు చేరి లక్షలాది గుండెల్లో చైతన్య జ్యోతివై
అక్షరాల లక్షలాది గుండెల బాధలని నీ గుండె భరించలేక ఆగిపోయింది
కార్చిచ్చును కౌగిలించుకొని కాపాడే వర్షపుజల్లైన బిడ్డెడి జాడకోసం
అడివి ఆకు రాల్చింది దుఃఖంతో

నీవు మమ్మొదిలినా.........!

నీ భావాలు రేలపాటలై అడివంతా విస్తరిస్తాయి
నీ ఆవేశం తుడుందెబ్బ తుమ్మెద ఝుంకారమై వనమంతా వ్యాపిస్తుంది
నీ ఆలోచన రేపటి ఆదివాసి ఉద్యమాల కంటిచూపౌతుంది
నీ ప్రేమ తునిక్కాయల తియ్యదనమై అడివిలో నిక్షిప్తమౌతుంది
నీవెప్పటికి మాకు వెలుగు రేఖవే.

# ఒంటి కంటితీర్పు

అరుంధతి! నీవు మమ్మల్ని ప్రశ్నిస్తావా? ఎంత ధైర్యం నీకు?
మేం స్వేచ్ఛ దేవతనే బంధించిన ఒంటికంటి దేవుని బిడ్డలం
పులులు మాంసం తినడం ప్రకృతి సహజమైనప్పుడు
జింకలు చస్తున్నాయని అరుపు లెందుకు? ఆ ఏడ్పులెందుకు?
మునిగిన గుడిసెల వాసాల్ని నదిలో ఎక్కడైనా
తేలాడుతుంటే వెతుక్కోండి
కావాలంటే సబ్సిడీపై వలల్ని సరఫరాచేస్తాం
బ్రతకడం చేతగానివాళ్ళకి సంస్కృతిక మిగులుందంటే మేమెట్లా నమ్మేది
నర్మదా ప్రవాహంలో నాలుగు కన్నీటి బొట్లు
అవి 'ఆదివాసులవో న్యాయదేవత కళ్ళగంతలు తడుపుతూ రాలినవో
అయితే ఏం ?
కరెన్సీ కట్టలు కాంక్రీట్ కట్టడాలు కన్నీళ్ళను
కూడ మా భూస్వాముల పొలాల్లోకే పారిస్తాయి
అరుంధతి! అర్థంకాని మాటలతో మమ్మల్ని ఆగ్రహపరుస్తావా?
మా కోడి కుయ్యందే సూర్యుడు ఉదయించడు అర్థమైందా?
ఉన్నోడి కోసం లేనోడు చావడం ధర్మమే
అందుకే అభివృద్ధిని ఆనకట్టల్ని ఆపేవారిని అంతంచేయడం న్యాయమే
అరుపుల్ని ఏడ్పుల్ని ఆపేందుకు నిన్ను
మా కొట్టానికి కట్టడిచేయడం న్యాయమే

పాందూరు పెద్దంచుధోతులపై ప్రేమెందుకో అని
కయ్యానికి కాలు దువ్వినవాడా!
గుండెనుండి గుండెకు చేరి లక్షలాది గుండెల్లో చైతన్య జ్యోతివై
అక్షరాల లక్షలాది గుండెల బాధలని నీ గుండె భరించలేక ఆగిపోయింది
కార్చిచ్చును కౌగిలించుకొని కాపాడే వర్షపుజల్లైన బిడ్డెడి జాడకోసం
అడివి ఆకు రాల్చింది దుఃఖంతో
నీవు మమ్మొదిలినా.........!
నీ భావాలు రేలపాటలై అడివంతా విస్తరిస్తాయి
నీ ఆవేశం తుడుందెబ్బ తుమ్మెద ఝుంకారమై వనమంతా వ్యాపిస్తుంది
నీ ఆలోచన రేపటి ఆదివాసి ఉద్యమాల కంటిచూపౌతుంది
నీ ప్రేమ తునిక్కాయల తియ్యదనమై అడివిలో నిక్షిప్తమౌతుంది
నీవెప్పటికి మాకు వెలుగు రేఖవే.

# ఒంటి కంటితీర్పు

అరుంధతి! నీవు మమ్మల్ని ప్రశ్నిస్తావా? ఎంత ధైర్యం నీకు?
మేం స్వేచ్ఛ దేవతనే బంధించిన ఒంటికంటి దేవుని బిడ్డలం
పులులు మాంసం తినడం ప్రకృతి సహజమైనప్పుడు
జింకలు చస్తున్నాయని అరుపు లెందుకు? ఆ ఏడ్పులెందుకు?
మునిగిన గుడిసెల వాసాల్ని నదిలో ఎక్కడైనా
తేలాడుతుంటే వెతుక్కోండి
కావాలంటే సబ్సిడీపై వలల్ని సరఫరాచేస్తాం
బ్రతకడం చేతగానివాళ్ళకి సంస్కృతిక మిగులుందంటే మేమెట్లా నమ్మేది
నర్మదా ప్రవాహంలో నాలుగు కన్నీటి బొట్లు
అవి 'ఆదివాసులవో న్యాయదేవత కళ్ళగంతలు తడుపుతూ రాలినవో
అయితే ఏం ?
కరెన్సీ కట్టలు కాంక్రీట్ కట్టడాలు కన్నీళ్ళను
కూడ మా భూస్వాముల పొలాల్లోకే పారిస్తాయి
అరుంధతి! అర్థంకాని మాటలతో మమ్మల్ని ఆగ్రహపరుస్తావా?
మా కోడి కుయ్యందే సూర్యుడు ఉదయించడు అర్థమైందా?
ఉన్నోడి కోసం లేనోడు చావడం ధర్మమే
అందుకే అభివృద్ధిని ఆనకట్టల్ని ఆపేవారిని అంతంచేయడం న్యాయమే
అరుపుల్ని ఏడ్పుల్ని ఆపేందుకు నిన్ను
మా కొట్టానికి కట్టడిచేయడం న్యాయమే

# నీవు - నేను - మనందరం

ఔను మరిప్పుడు
మనం తప్పుల వెదుకులాటలో
తలలు పగులగొట్టుకుందామా!
వాడు ప్రపంచ అడవుల్ని ఆకుపచ్చ పురుగై భక్షిస్తున్నవాడు
భూమినంత వ్యాపార పొగమంచుతో కమ్మేసినవాడు
దాహాన్ని పెట్రోల్‌తో తీర్చుకుంటున్నవాడు
యుద్ధాలతో చలిమంట కాగుతున్నవాడు
అందాన్ని ఆడవారి నడుముల్లోకి జార్చినవాడు
దేశాల్ని అప్పులబిగి కౌగిలిలో బంధించివాడు
వాడు కన్నుల్లో కాఠిన్యాన్ని దాచి కరుణామయుని అవతారంతో వస్తాడు
ప్రపంచాన్ని మందుపాతరపై నిలబెట్టి మత బోధకుడై
శాంతిని ప్రవచిస్తాడు
గ్లోబుపై హెచ్చుతగ్గుల్లేని రోబోట్ రాజ్యాల నిర్మాణం స్వప్నంగా
చూపిస్తాడు
మార్కెట్‌దారిలో మైమరచే మాయాజాలాన్ని సృష్టిస్తాడు
పేగునంబంధాల్ని ప్రేమబంధాల్ని పెంటకుప్పల పాలు
చేయమంటాడు
చీమ చిటుక్కుమన్నాచాలు

వాడు-నిమిషాన్ని నిమిరి నిప్పుల వర్షం కురిపిస్తాడు
నీవు - నేను - మనందరం
హిరోషిమాలో కాలి కమిలన శవాలమయ్యాం
వియత్నాంలో విగిరిపడ్డ మొండాలకు మొలిచిన
మొక్కలమయ్యాం
రాజీ మాటలకు రాలిపడ్డ చిలీ-అలెండీలమయ్యాం
భాష, భావం చచ్చి ఒక్కసారిగా ఘనీభవించిన
మంచు ముద్దలమౌతున్నాం
వాడి చురకత్తుల జడివానలో రక్తపు ముద్దలైనవాళ్ళం
వాడి బహుముఖ కరవాలానికి ఖండించబడ్డ
అవయవాల కుప్పలం
నీవు - నేను - మనందరం
ఏదోనాడు సద్దాంహుస్సేన్‌లం - బిన్‌లాడెన్‌లం
అరాఫత్‌లమౌతాం
మరణ శాసనం మంత్రంగా మారి మనల్ని మింగేస్తుంది
మిత్రమా!
మన శత్రువు చిరుగాయాలతో చిరునవ్వులు చిందిస్తునే
ఉన్నాడు
మనంమాత్రం తెగిపడ్డ చెట్ల మొదళ్ళమయ్యాం
మనం కేవలం ఒక్కొక్క ఆయుధంగానే మారాం
వాడికి మనం వేయించబడే ఉసిళ్ళపురుగులం
చీకటయినా వెలుగైనా వెదుకులాట తప్పనిది
చావే బ్రతుకైన చోట బతకడం కోసం చావడంలోతప్పులేదు
భాష ఏదైతేనేం భావమొక్కటే
పోరాటపు పొలికేక పెట్టాల్సిందే
మార్కెట్ టెర్రరిజంపై
నువ్వు - నేను - మనందరం
పోరాటపు పొలికేక పెట్టాల్సిందే

(నా పాట మీనోట పుస్తకావిష్కరణ కవిసమ్మేళనం)

# స్వార్థం

సన్యాసి హుక్క పట్టినట్టు
పిల్లాడు గుక్క పట్టినట్టు
నగరాలు బొగ్గుపులుసువాయువును శ్వాసిస్తున్నాయ్
పరోపకారం తెలియని మనిషి పురుగుజాతి
భూమాతను తొలిచేస్తుంది
ఆమె వంటిపై పచ్చబట్టను పచ్చిగా లాగేస్తుంది
స్వార్థం జీన్స్‌ను నరనరాన పట్టించుకున్న
పరోపకారం తెలియని జాతి "మనిషి పురుగుజాతి"
దీనికి అతి సుఖవాదం సుఖరోగం కన్న ఎక్కువైంది
కంటికి పంటికి వంటికి అన్నీ కోరింది
తథాస్తంది భూతల్లి
పరోపకారం తెలియని మనిషి పురుగుజాతి
చివరకందీ నీ ప్రాణాలు కావాలని
నియంతగా మారి ప్రక్కజాతుల్ని ఫలహారం చేస్తుంది
గుండ్లని గుట్టల్ని గుండెల్లో గునపాలేసి తీసింది
"పరోపకారం తెలియని జాతి మనిషి పురుగుజాతి"
క్యాన్సర్ పుండ్లలా భూమాత వొళ్ళంత నగరప్పువ్వుల్ని పూయించింది

వాటిల్లోంచి రసికారినట్లు మురుగుకాల్వలు
ముక్కు మూసుకొని ప్రవహిస్తున్నాయ్
ప్రకృతికి వ్యతిరేకంగా మనిషి సృష్టి వికృతి
అది వైవిధ్యం లేని ఒక వంకర ముఖం
"పరోపకారం తెలియని మనిషి పురుగుజాతి"
నిజారణ్యాల్ని నిర్మూలిస్తూ వొంటరి కోతుల్లాంటి
సామాజికారణ్యాల్ని సృష్టిస్తుంది
నిజవర్ణాలు నిస్తేజం చెందితే, అమ్మ
వర్ణాలు అడ్డదారుల్లో వస్తాయి
"పరోపకారం తెలియని మనిషి పురుగుజాతి"
స్వార్థానికి అభివృద్ధి మరో ముఖం
కోకిల లెక్కడివి? కొండముచ్చు లెక్కడివి
కొరివి దయ్యాల్లాంటి చింతతోపులెక్కడ
అంతా విధ్వంసమే
"పరోపకారం తెలియని పరాన్నజీవి మనిషి పురుగుజాతి"
కన్నతల్లి కంటి కోపమే సమస్త జీవజాతి శాపమే
కరువు కాటకాలు అతివృష్టి అనావృష్టి
తప్పొప్పుకొని ఒక్కసారైనా ప్రకృతి తల్లి పాదాల చెంత ప్రణమిల్లుదామా!
పరోపకారమే తెలియని జాతి "మనిషి పురుగుజాతి"

(ఆదిలాబాద్‌లో)
(ఆచార్య ఎన్. గోపి గారి జలగీతం దీర్ఘకవిత సమాలోచన సందర్భంగా 22-6-2003)

# బడి బందిఖానా

స్కూలు నుండి తిరిగొచ్చిన నా కొడుకును చూస్తే...
గాలికి రెపరెపలాడే పుస్తకపు కమ్మల్లా
జ్ఞాపకాలు అలలు అలలుగా..
బచ్చగాని బోడుపై చిక్కుడు పబ్బులకై
చెలిగిన చెట్ల కొమ్మలు
చెఱువుకట్ట డంకెన్ మామిడిచెట్లు
చలికాలం పొద్దు పొద్దున్నే కుంపట్ల బొగ్గు పొగవాసన
మొదటి బజిలోల్ల సైకిల్ శబ్దాలు
కనుమరుగైన దోస్త్ కండ్లెదుటే ప్రత్యక్షమైనట్లు
మస్తిష్కపు దారుల్లో దాగున్న అనుభూతులు
కందిరీగలై రొదపెడుతున్నాయ్
అవి కుట్టిన కొద్దీ జ్ఞాపకం చెఱువులో మునకేసి చర్మం తడిబారింది
తడితలకు గచ్చకాయలే దువ్వెనలయ్యాయి
డంకెన్ పైనుండి డైకొట్టినట్టు మనసు తలకిందులయ్యింది
ఆనందం అనుభూతి సాయంత్రం ఇంట్లోపడే దెబ్బల్ని మర్చిపోయింది

దొంగ మామిడికాయలు పుల్లటివే కాని
తియ్యని జ్ఞాపకాలై నోట్లో నీళ్ళూరుతున్నాయ్
ఎండకాలం ఎండిన వరిమళ్ళలో
పిచ్చి బంతాటలో ఈపుసుర్రుమనడం ఇప్పటికీ గుర్తే
బడితెరవగానే కొత్తనోటు పుస్తకంలోని కమ్మలు కాగితప్పడవలై
కంటికి కనిపించనంత దూరం సాగిపోయేవి
నదినీ సముద్రాన్నీ చేరుతాయనే భ్రమతో
రాత్రి ఆనందంగా నిద్రపోయేవాణ్ణి
చలికాలం నట్టింట్లో నెగడేసి పుస్తకం తెరిస్తే
అమ్మ బొత్తలో బజ్జున్నప్పటి ప్రశాంతత
చదవడం జబర్దస్తీ కాని రోజది
మావాడు హోంవర్కు చేస్తున్నపుడు
మాతాత బండెడు కట్టెలు కొట్టడం గుర్తొస్తుంది
ఆస్కూలు ముందునుంచి నడుస్తుంటే
బందిఖానాను చూసిన అనుభూతి
చిరునవ్వుల్ని గుప్పిట బంధించిన రాక్షసహస్తాన్ని చూస్తున్న భావన
నాకు బాల్యం జ్ఞాపకంగా మిగిలింది కాని
నా కొడుకుదసలు బాల్యమేనా......?

# గుండెతడి

కల్లబొల్లి మాటల్లో దాగున్న
కరుకుదనం కనిపెట్టలేనంత
అమాయకత మాలోపోయింది
మా ప్రశ్నలు బాకుల్లా
మీ అన్యాయాన్ని నిలదీస్తే
చాకుల్లాంటి పూరేకుల మాటలు విసురుతారని తెలుసు
బురదబుక్కిన మా ఒంటి బరిబద్దబొక్కల్ని
తడమని గోదారి మమ్మల్ని చుట్టొచ్చి మీదయ్యిందా?
మీ పొలాల్లో పొర్లించుకున్న గోదారి
ఇప్పుడు పల్లెగోరీల మీదినుంచి పట్నం
బొడ్రాయి దాకా ప్రవహించాలంటావ్
బస్తీని జబర్దస్తీగా కబ్జా చేసిన బలిసిన
వలస ఇండ్ల పంపుల్లోకి పారాలా!
ఇరానీ చాయ్ ఇరుకుసందుల్నే ఎందుకు చూపుతావ్!
పాయలు పాయలుగా పారితే గీరితే బంజారా హిల్స్ లోకే
లేకుంటే ఆంధ్రా కాలనీస్‌కే
గోదారి నీకు కంటి చెమ్మేనేమో కానీ.....

మాకు మిగిలున్న గుండెతడి
పైసలకు పక్కలేసే బస్తీనాగరి
కత తెలువని పల్లెలు మావి.
మా రక్తాన్ని బస్తీకి నీటి రంగులా అద్దాలనే తపనలో
దాగున్న కొండెంగతనం అర్థం చేసుకోలేని
అమాయకులం కాము
పుష్కరాలు గోదారి కొస్తే
డబ్బు సంచులు సన్నుయ అరుగు
అంచుకు తాకడంలో మతలబేమిటో!
బక్కచిక్కిన బాసర సరస్వతి
ఎండిపోయిన ఎముడాల రాజన్న
బందీ అయిన బద్రాద్రి రామన్న
గోదాట్లో రాలిన చిల్లర పెంకులేరుకుంటున్నారు
వేశాలపై గుత్తాదిపత్యంతో అవార్డులు రివార్డులు అన్ని మింగి
అన్న ప్రేమను చూపిస్తే ఎలా నమ్మాలి?
మా బాసకీ యాసకీ గుండు సున్నా చుట్టిన
విదూషక వికట మనస్తత్వం మీదికాదూ!
బాధల్ని అన్యాయాల్ని చూడలేని
కార్నియల్ ఒపాసిటితో ఉన్నోళ్ళకి అవి
ప్రాంతీయ దురభిమాన శుక్లాలుగా
కనిపించడంలో వింత లేదు!!!

('గోదావరికి ప్రేమించడం' తెలుసు కవితకు సమాధానంగా)
(25-5-2003 ఆంధ్రప్రభ)

# లోన్‌లీనెస్

తల్లి రొమ్ము నుండి తలనెట్టితే
పాల బుగ్గల పసిపాపకు ఒంటరితనం
అమ్మ వొడినుండి బడిమెట్లపై మొట్ట మొదటిసారి
నిలబడ్డప్పుడు ఒంటరితనం
పాసై మెమోతో మేను పులకరించినా..
నేస్తాల ఎడబాటుతో నెలకొన్న ఒంటరితనం
ఉద్యోగపు ఉత్తర్వుతో కడుపునబెట్టుకొని
కన్నతల్లిలా కష్టసుఖాల్లో సాకిన
ఊరుతో వొంటరితనం
ట్రాన్స్‌ఫర్ ఆర్డర్‌తో ఒక్కడే ప్రయాణమైతే
భార్య పిల్లల ఆలోచనల ఒంటరితనం
కంపల్సరి రిటైర్మెంట్‌తో చేతినుండి తెగిపడ్డ వేలులాంటి జీవితంలో
చేసిన పనిని మరువలేని వొంటరితనం
కాళ్ళొచ్చిన పిల్లలు పెండ్లిళ్ళతో రెక్కలొచ్చిన పక్షులయ్యాక
కమ్మేసిన ఒంటరితనం
వృద్ధాప్యపు నిద్రలేమి అర్ధరాత్రి చీకట్లు
నల్లని ఆకాశాన్ని చూపిస్తే
తుంటరి మనిషిని కప్పేసిన కాస్మిక్ లోన్‌లీనెస్

# మౌనం

నిశ్శబ్దం మంచిదేనా?
గోడమీద పిల్లి తరాజులో రాజకీయనాయకుడు
జనాల్ని అస్పష్టతలో ముంచి బ్రతికేస్తారు
ఇష్టమైనది ఇష్టంలేనట్టు
తప్పు ఒప్పైపోయినట్టు నమ్మేయాలి
ఐదేండ్లకు కాకుంటే రెండేండ్లకొకసారి
ప్రజలకు దేవతావస్త్రాల్ని కప్పుతారు
నక్కను తొక్కిన నిరుద్యోగి పెండ్లికొడుకైతే
కట్నం కనకమాలక్ష్మికి మౌనం అర్థాంగీకారమైతే
నచ్చింది... నచ్చాడు...
మధ్యనుండి మంగళవాయిద్యాల శబ్దాలతో వరకట్ననిషేధచట్టం
పెండ్లి భోజనం చేసి వెళ్తుంది
వైద్యుడు భూత వైద్యుడు నడమ ఆపదమొక్కులవాడు
రోగాన్ని రొక్కం తీసుకొని తగ్గిస్తారు
తగిలిన రాయి ఏదో తెలవక మౌనంగా తలపెట్టుకోవాలి
అనుమానపు చావు హత్య  ఆత్మహత్యల
సందు కొనఊపిరితో కొట్టుకుంటుంది

పైసల బరువు ముల్లు మొగ్గును తేలుస్తుంది
రాబందు అరణ్యంలో విషపురుగుల వేటకు పిట్టల్ని పిలిచింది
అరణ్యం నాశనమైంది కాని ఒక్క పురుగులేదు
పిచ్చుకలు కిలకిలరావాల్ని మరచి మౌనాన్ని ఆశ్రయించాయి
అడివిలో కనిపించే శవం సాయుధమై
ఊరిలోకి రెండు కథలతో దూసుకొస్తుంది
ఒకటి నిజం ఒకటి అబద్ధం
రెండింటి మధ్య మౌనం
భయం మౌనాన్ని మంచిదానివని సర్టిఫై చేస్తుంది
మౌనం గురువై నంగనాచితనం నేర్పుతుంది
నిస్సహాయత కొద్ది క్షణాల మౌనప్రార్థన
నిజాన్ని నిలువునా మింగేస్తుంది
నిజం నిప్పే కాని
దాన్ని కప్పి చల్లార్చే వికృతశక్తే మౌనం

తేది : 15-08-2003

# తాత

యాదొస్తున్నవే నువు యాదొస్తున్నవే
అద్దంలకు తలబెడితే నర్సినెంట్రికలు నవ్వబట్టె
నీకేందే అరవైయైదేండ్లకైనా నల్లజుట్టుతో నువ్వు
మోకు గీతకోడవళ్ళు నడుస్తూ కల్లు బుడ్లతో పొద్దుపోతుంటే యాదోస్తవ్
పులిమార్కు చుట్ట పొగతో ముచ్చట్లాడే
ముసలోడు అగుపిస్తే అచ్చం నీకుమల్లె గొట్టవట్టె
గీ ముచ్చట్లకేంగాని
నువ్వు చెప్పిన కథే
సముద్రం తగలబడ్డది చాపలు చెట్లెక్కినై
అవ్ నే నమ్మలే తాతా గప్లత్ జెప్తున్నడనుకున్న
గిప్పుడైతే గసంటిఎన్ని కతలో
ఇని ఇని సెవులు తూట్లు బడవట్టే
సదువుకొ నర్సిగా అని మీ అయ్య సావగొట్టిడంటివి
దిగుడు బాయిల దినమంతా దాక్కున్ననంటివి
దింపుడుగల్లాలైనా మిగిలినై గాని గిప్పుడు దిగుడుబాయిలేవ్

యాదొస్తున్నవే నువ్వు యాదొస్తున్నవే
ఎక్కడన్న భూమిల బోగ్గు వాసనొస్తే
నువ్వ బుజాన బొగ్గుపెల్లతో నడిచొస్తున్నట్లుంటది
గిప్పుడైతే గ్యాస్‌పాయిలొచ్చినై
గాని యాడదిక్యాడాదికి జనం గ్యాస్ బోబట్టె
సూసిపోను సుట్టాలొస్తె గాదినం గెట్లుండెనో నాకెరుకే
గీదినానా పొమ్మనలేక పొగబెడ్తుండ్రు
ముచ్చెట్లు లేవ్ అచ్చట్లు లేవ్ ఏందో బతికేస్తుండ్రు
నాటు మక్కల్ని జూసినా ఊరికోడ్నిజూసినా
యాదొస్తున్నవే నువ్వు యాదొస్తున్నవే
తునిక్కాయల్ని ఎలక్కాయల్ని పరికపండ్లని జూసినా
యాదస్తున్నదే నువ్వు జెప్పిన ముచ్చట యాదస్తున్నదే
"బతికేందుకు భయపడొద్దు"
గిది యాదిబెట్కొనే బతుకుతున్న
... ఉంటనే ...

# దేవుడు ముట్టైండు

దేవునికి అల్వొచ్చింది
గిట్ల భూమిమీద అడుగేద్దామని సుట్టి బెట్టిండు
ఊరిసివరన వొళ్ళు నాలుగు ముక్కలై ఊల్యకుబోయింది
గాయనకు తెల్వకుండా ఐదోముక్క తయారయ్యే
దేవునికి భయం బట్టింది గిదేంది గిట్లవబట్టె
నాకు తెల్వకుండా గిట్లేటేయే
మడుసులు ఏందో జేస్తున్నరు
ఎన్నిదినాల్లే తొమ్మిదొద్దులేగా
ముక్కుమూసుకొని తొండం ముడ్సుకొని
గూకొంటే పోలే అనుకొబట్టిండు
పూజలు కొబ్బరికాయలు గొట్టుడు అబ్బా.. బ్బా..
సినిమా పాటలే భత్తి పాటలయే
పోరగాల్లు ఒకటే ఎగురుడు
గీళ్ళదీ బత్తో ఆనందమో తెల్వకపాయే

దేవుడిగ్గూడా మంచిగానే అన్పిత్తుంది
మడుసులూ తెల్విబారిండ్లు అనుకుండు
సివరిదినాన దేవుడి నాల్గు ముక్కలత్కినై
ఐదోముక్కకు జనంజెల్లగొట్టింగ్రు
మడుసులు ఐదోముక్కతో ఆట్లాడుతుంగ్రు
నేను దేవున్ని జెప్తున్న ఇనుకోంగ్రి అనిమోతుకోబట్టిండు
దేవుడుదేన్నో బోగొట్టుకున్నటైండు
మడుసుల భయాన్కి దేవుడు పారిపోయి కాల్వల దూకి
అయ్యవ్వదగ్గరికి బోయిండు
దెగ్గర్నుండి జూస్తే దేవుడైదోముక్క రత్తంతో నిండిన గుండెకాయ

నీతి : మడుసులు ముట్టైన దేవున్ని పూజెయ్యరు.
(ప్యాపిలి సంఘటనపై)